A

# వెలుగు రవలు

రచయిత
నాగభైరవ శివరామకృష్ణయ్య.

0·6·0



విద్వాన్
నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు

౭౫-౯౦

# అంకితము

ప్రగాఢ దైవవిశ్వాస సంపన్నులూ, నా భావలతా వితానానికి ప్రోదిసేసినవారూ, సాహిత్యసరస్వతులూ అయిన నా గురుదేవులు, విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి గారికి—

వినీతుడు

ర చ యి త

# పీఠిక

'వెలుగురవలు' అనే ఈ గ్రంథాన్ని రచించిందాక పందొమ్మిదేండ్ల యువకుడు. ఇందులో ఆర్థిక రాజకీయ మత విషయాలనుగూర్చి ఆయనకు తోచినవిషయాలు నిక్కచ్చిగా వ్రాశాడు. ఈమూడూ మహత్తరమైన విషయాలు. వీటిపైన సుప్రసిద్ధులువ్రాసిన ఎన్నో ఉత్కృష్టగ్రంథాలున్నవి. వాటిని ఈయన చదివి ఒక సొంతగ్రంథాన్ని తయారుచేయలేదు. సొంతంగా తనకు తోచిన విషయాలనే నిర్భయంగా వ్రాసినట్టు కనబడుతోంది. అయితే ప్రస్తుతం ప్రపంచంలో నడుస్తూన్న కొన్ని వుద్యమాలకు ఆయన కొంత సన్నిహితంగా వుండడం చేత ఆయన భావాలకు పరిసరవిషయాలు కొంత దోహదం కలిగించి వుండవచ్చును. ఆయన వ్రాసిన ప్రతివిషయంలోనూ వాదప్రతివాదాలకు తావుండవచ్చును. కాని ఆయన యే దృక్పథంతో తన వాదాన్ని సాగించాడో ఆదృక్పథాన్ని మనం అవగాహన చేసుకొంటే ఈ గ్రంథాన్ని శ్లాఘించడానికి వీలవు తుంది.

గ్రంథకర్త తాను స్పృశించిన విషయాలపైనగల ఉత్కృష్ట గ్రంథాలను పఠించి ఈ గ్రంథం వ్రాయలేదన్న మాత్రాన అది ఒక నిరసనవాక్యంగా భావించకూడదు. సుప్ర సిద్ధులు రచించిన గ్రంథాలు చదివి వాటికి బానిసలై సొంత ఆలోచనలకు చోటీయలేని యువకు లనేకులు తయారవు తున్నారీరోజుల్లో పూర్వులేమిచెప్పినాసరే! పెద్దలేమన్నా

సరే! తన అభిప్రాయాలను సకారణంగా, పూర్వుల అభిప్రాయాలకుగానీ, సంఘంలో నేటి సుప్రసిద్ధుల అభిప్రాయాలకుగానీ భిన్నంగా వున్నప్పటికీ, కచ్చితంగా చెప్పగలవాడే ప్రతిభావంతుడు. ఈగ్రంథంలో అటువంటి ప్రతిభాంకూరాలు అక్కడక్కడ ప్రస్ఫుటమౌతున్నాయి.

చిన్నవయస్సులో బహుగ్రంథావలోకన లేకుండానే ఉత్కృష్టవిషయాలనుగూర్చి తన అభిప్రాయాలను వ్రాయాలనే సాహసం కలగడమే ఈయువకుని భావ్యభివృద్ధికి సూచన.

ఈయన అభిప్రాయం దేవుడులేడనీ మనం సంపాదించే విజ్ఞానమే దేవుడనీ, ఆవిజ్ఞానమే సర్వార్థసాధకమనీ, దేవుడు మూర్ఖులకోసం, ముసలివాళ్ళకోసం, అసమర్థులకోసం సృష్టింపబడ్డాడనీ కార్యశూరుడు తన జయాపజయాలకు స్వశక్తిమీదనే ఆధారపడవలెననీ ఈయన బోధిస్తున్నాడు. ఇదికాదని పెద్దపెద్దపండితులు చాలామంది సహేతుకంగానూ సక్రోధంగానూకూడా వాదిస్తే వాదించగలరు. కాని ఈ యువకుని ఈ అభిప్రాయాలవల్ల మనజాతికిగానీ, దేశానికిగానీ ముప్పులేదు. జాతి చైతన్యవంతమవుతుంది. దేశానికి మోక్షం వస్తుంది.

ఈయన రాసిన రాజకీయ ఆర్థిక విషయాలలో భేదాభిప్రాయాలకు చాలా తావుంది. ప్రపంచకమంతా పరస్పర వైరుధ్యంగల ఉద్యమాలూ అభిప్రాయాలూ కుప్పతిప్పలుగా బయలుతేరుతూన్న ఈరోజుల్లో ఇటువంటి భిన్నాభిప్రాయాలు తప్పనిసరి.

గ్రంథకర్త ముందుముందు ఇంకా ప్రపంచానుభవం సంపాదించినపిమ్మట తన గ్రంథంలోని గుణాగుణాలను ఇతరులకంటె తానే ఎక్కువగా విమర్శించుకొనగల పరిణతబుద్ధి కాగలడని విశ్వసిస్తూన్నాను.

తెనాలి,
7—2—39.

కొడాలి ఆంజనేయులు

# అభిప్రాయము

ఈ గ్రంథకర్త యువకుడు యువకరక్తము ప్రవహించు చుండుటచేతనే తన ప్రథమకుసుమమునకు వెలుగురవలు అను పేరిడినారు. ఈచిన్నగ్రంథాన్ని అక్కడక్కడ చూచుభాగ్యము నాకు లభించినది. చదివినకొలది మరి చదువవలయు నను పించుచున్నది. భాష అందచందములతో కూడి, ఇంపుసొంపు లతో అలరారుచున్నది. శైలి అతి గంభీరముగాక, అంత సులు వైనదియు గాక, యువకబృందమును అట్టె ప్రోత్సహించుటకు తగియున్నది. మధ్యవర్గమువారిని కార్మిక కర్షక సేవకులనుగా తయారుచేయుటకు వుపయుక్తమవుతుంది వీరిభాష.

ఇక భావాలు ఇవి పూర్వకాలపు భావాలుగాక, నవీన యుగపు భావాలనే చిత్రించినారు మన గ్రంథకర్త. కార్మిక కర్షకులపైన వ్రాయుచూ రానున్నయుగము కార్మిక కర్షకుల దేనని చక్కగా నిరూపించినారు.

ఇట్టి చిన్నిపొత్తములు కార్మిక కర్షక విప్లవమునకు అత్యంతంగా తోడ్పడతాయి. కనుక ఆంధ్ర రైతాంగము తర ఫున ఈ 'వెలుగురవలు' అను జ్యోతిని ఆహ్వానించుచున్నాను. గ్రంథకర్త విరివిగా పొత్తములను ప్రచురించి కూలీ రైతులలో ప్రచారం గావించుతారని నమ్ముతున్నాను.

సహాయ కార్యదర్శి,
ఆంధ్రరాష్ట్రరైతుసంఘం.
ప్రధాన కార్యదర్శి,
రాయలసీమయువజనసంఘం.

ఇట్లు
డి. యస్. వల్లభరావు.

# అభిప్రాయము

దేశదేశాంతరములకేగాక ఖండఖండాంతరములకుగూడా అన్నప్రాశనమొనరించిన భారతదేశం నేడేమూలజూచినా కరువు కాటకముల కాటపట్టయి, చారెడుగంజికి, జానెడు గుడ్డకు నోచుకోని దరిద్రమూర్తుల ఆర్తనినాదములతో నిండి నిబిడీకృతమయి యున్నది. నేడీ విశాల భారతావనియం దే మూల పరికించినా, ధనవంతుల దాస్యమనెడి పెనుభూతపు బిగికౌగిలిలో నలిగి నసించెడు క్షుధామూర్తుల దైన్యస్వరూపాలే సహృదయుల దృష్టిపథమున కడ్డుతగులుతున్నాయి. పగలంతయు పాటుబడి, ధాన్యరాసులు పండించి, ధనవంతుల కొట్లు నిండించి, తాను, గొడ్డు, బిడ్డ కృంగి కృశించిపోతోంది రైతులోకం. ఏండ్లతరబడి చదివి చదివి, అధికారుల రూక్షవీక్షణములకు గురియై, దుష్టపరీక్షల నెట్టులో గట్టుఎక్కినా, నిరుద్యోగదేవత కాత్మబలి కాక తప్పిందిగాదు. యువకబృందమునకు, ఇట్టిపరిస్థితుల్లో, క్షణక్షణమునకు చిత్రవిచిత్రగతుల పరుగిడుచున్న ప్రపంచపరిస్థితుల మార్పును గ్రహించి, ప్రతియువకుడు దేశారాధనకు గడంగుట యుక్తము. అట్టి వుద్దేశముతో బయల్వెడలిన కవి వుద్యమము ప్రశంసనీయమేగాక పోషణపాత్రము.

కవి వుత్సాహవంతుడగు యువకుడు. సస్యశాలినియైన భారతదేశమున, నేడీ దరిద్రదేవత తాండవించుటకు కారణం బెద్దియో సులువుగా నిరూపించియున్నాడు. కవి తన గ్రంథమునందు రచించిన కర్షకుల కష్టపరంపరలు చదివిన, కాఠిన్యముచే కరడుగట్టిన హృదయము సయితము కరిగి కాలువగా ప్రవహిస్తుందనడంలో సందేహంలేదు.

నిత్యము దృక్పథమున కడ్డుతగులుతున్న క్షుధామూర్తుల దైన్యజీవితముల నేర్చికూర్చుటలో, కవియొక్క హృద్గత ఆవేదనను చదువరులకు వ్యక్తపరుచుచున్నాడు. చిట్టచివరకు దేశదాస్యమును మూలచ్ఛేదన మొనరించి, ధనికవాదమును చీల్చి చెండాడి, శ్రమజీవులకు ఆకలిదప్పులు దీర్చు మానవసంఘములో ప్రవేశమునొసగు ఆ సోవియటు విధానమే గమ్యస్థానముగా రచించినందులకు కవిగారికి నా ధన్యవాదములు.

మరియు మన కాంగ్రెసుపెద్దలు చెప్పిన శాంతియను పదమునకు, సరియైన నిర్వచనము గావించి, దాని స్వీకరణాస్వీకరణకు యుక్తిప్రయుక్తులతో, యుక్తాయుక్తసమయములు తీర్చికూర్చినారు.

సోషలిజంబనునది, ఒకదేశమునకుగాని, మరియొక ఖండమునకుగాని సరిపడు రాజకీయధర్మముగాదు. ఈనాడు రష్యాలో వుంది. రేపు ఇండియారావచ్చు. కొన్నాళ్ళకు చైనాలో సంపూర్ణముగా సోషలిజం వచ్చిందంటే, మరికొన్నాళ్లకు జపాను రావచ్చును. వేయేల? ఎక్కడక్కడ దోచుకొనేవారు, దోచుకొనబడేవారు వుంటారో, ఎక్కడక్కడ దేముళ్ళు దయ్యాలు పేర్లుజెప్పి, కర్మసిద్ధాంతాన్నిబోధిస్తారో, ఎక్కడైతే సామ్రాజ్యతత్వజ్వాలలకు కూలీలు రైతులు ఆహుతిగా మారుతున్నారో అక్కడల్లా సామ్యవాదం వచ్చితీరుతుంది. కామ్రేడ్ శివరామకృష్ణుని ఈ గ్రంథము కార్మికులకు రైతులకు, యువకులకు ఆశాజ్యోతియై వెలుగొందునని ఆశించుచున్నాను.

భగవంతరావు.

# తొలిపలుకు

ఆపుకోలేని ఉత్సాహం యీ రచనకు కారణం. రచన సంస్కృత బహుళంగావుంటే సంవిధానవిశేషంగా స్వీకరించండి. నావర్తమాన భావసంపత్తికి ఆశ్రయం మహారాజ శ్రీయుతులు సుంకర రంగయ్య, అట్లూరు వెంకటప్పయ్య చౌదరిగార్ల సాహాయ్యప్రోత్సాహాలు. వారి ఋణమీగుటకు హృదయపూర్వక ధన్యవాదాలు సమర్పించటంకంటే ఏమి చేయగలను. నన్నీరచనకు ప్రోత్సహించిన కామ్రేడ్స్ లక్ష్మినారాయణ, ఆదినారాయణ, బాపయ్య, భగవంతరావుగార్లు మరువరానివారు. అడగంగానే పీఠిక వ్రాసియిచ్చిన కామ్రేడ్ కొడాలి ఆంజనేయులుగారికి నా హృదయపూర్వక వందనాలు సమర్పించుచున్నాను.

ఇట్లు

రచయిత



కామ్రేడ్

నాగభైరవ శివరామకృష్ణయ్య

# వె లు గు ర వ లు

లోకంలో వుదయించిన మానవ పశు పక్షి పిపీలికాది యావజ్జీవులలో, అత్యున్నతస్థానాన్ని ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అధిష్ఠించి, అద్వితీయంగా రాజ్యమేలుతూవుంది మానవజన్మ. శక్తిసామర్థ్యాల్లోనూ, యుక్తి ప్రయుక్తుల్లోనూ, అగ్రతాంబూలం ఈ జాతిదేనని చెప్పడంలో సందేహంలేదు. అందులో భారతదేశవాసుల భాగ్యవైభవాన్ని భావగర్భితవిషయ నైపుణ్యాన్ని వర్ణించడం సూర్యుని వెలుగుతో జూపెట్టినట్టుగా వుంటుంది. తదితర దేశాలకంటె, ఇంచుకమించిన జ్ఞానతారలు, ఈ భారత గగనపథంలో ప్రజ్వలిస్తున్నాయి. ఇక సంపద విషయంలో చూస్తే, ఇతర దేశాలకంటె, సహస్రాంశాలు మిగిలిపోతుంది భారతదేశం. ఇతర దేశాల్లో, భూమిని త్రవ్వగా తేలే పదార్థం, ఇనుము, బొగ్గు, పెట్రోలు, ఇత్యాదికవర్గం బయటబడుతుంది ఆత్మహత్య చేసుకోటానికివలె వత్తిడి గలిగి నప్పుడు తనంతట తానే దగ్ధమవడానికి. ఇక భారతదేశమో? రత్నగర్భా, వసుంధరా, అని సార్థకనామాలతోనూ, సహజ సౌందర్యంతోనూ, దిగంతములవరకూ, ప్రకాశమానంగా వుంది. భారతదేశవాసుల విజ్ఞానసంపదను పురస్కరించుకొని చూస్తే, సమస్త వస్తువులకూ, నెలవైంది భారతావని. పాడి పంటలకుగానీ, కామితార్థాలకుగానీ, సిద్ధినికల్పించే, కామ ధేనువు భారతదేశం. ఫలభారసమన్వితంగానూ, పరిమళ ప్రసూన మంజరులతోనూ, పరంజ్యోతిగా ప్రజ్వలించేది భార

తావని, ఒక్కటేనని చెప్పడంలో, సందేహంలేదు. తారకా సంచయంలో, పూర్ణచంద్రుడిలాగా వెలలేని వెలుగునిచ్చి దేశదేశాంతరాలకేగాక, ఖండఖండాంతరాలకుకూడా, అఖండ జ్యోతిగా ప్రజ్వలించే దీదేశమేనని, సగర్వంగా చెప్పడానికి ప్రతి భారతీయుడికీ హక్కుంది. అజ్ఞానతమస్సులోవున్న పశు పక్షి పిపీలికాదులకేగాక, విజ్ఞానంతో వెలుగొందుతూవున్న ముప్పది యేడుకోట్ల మానవజాతికీ, కమ్మని అన్నం కడుపునిండాపెట్టి, కట్టుగుడ్డలు సహితం కరువులేకుండా యిచ్చి, రక్షించుతూ వుంది యీ భారతదేశమే.

నిజంగా ఇతరదేశాలకన్న ప్రాశనచేసింది, యీదేశమే నని చెప్పడంలో, అతిశయోక్తిలేదు. దానితోబాటు తిండి తిన డానికిగాని, అధికారం చెలాయించడానికిగాని, ఔర్జన్యాన్నోడి గట్టుకోడానికిగానీ తగినంత అవకాశమిచ్చింది, మన వసుంధరే.

అటువంటి భారతదేశంలో ఈ రోజున కోట్లకొలదిగా మానవులు,కాయకష్టంచేత, కండరాల కాఠిన్యాన్ని కరిగించి, శరీరాన్ని కృశింపజేసి, జీర్ణవల్కలాలతో, దైన్యజీవితాలతో, హైన్యభావాలతో, క్రూరకర్మలతో, కూకటివ్రేళ్లతో క్రుంగి కృశించిపోతున్నారు. ఆ నికృష్టదైనిక జీవితహాహాకార నినా దాలే ఈరోజున భారతదేశంలో, ఏమారుమూల పరికించినా, ప్రతిధ్వనిస్తున్నాయి. అంతమాత్రమేగాక, విజ్ఞానదృక్పథంలో, జీర్ణవల్క లాచ్ఛాదితమైన, ఆశుష్కశరీరాలే ప్రతిబింబి స్తున్నాయి.

ఎక్కడచూచినా తినడానికి తిండిగాని, కట్టడానికి బట్ట గాని, లేక మలమలమాడుతూవున్న క్షుధాకలితపీడితవర్గమే మన దృక్పథములో అద్దుతగులుతూంది. వేసంగిలో ఎండవేడిమినిగాని, వర్షకాలంలో వర్షభీతినిగాని, శీతకాలంలో చలినిగాని, లెక్కచేయక కాలత్రయధర్మాలను కాల్చివేయగల కర్కశభావపూరితహృదయాలే, ఈ దైన్యజీవితాలు.

మానవజీవితానికి ఆనందం ఆదర్శప్రాయమైన వస్తువనిన్నీ, దాన్ని సాధించగలిగేసాధనలో సన్నద్ధుడుగా నుండాలనిన్నీ, సామాన్య మానవజాతికంతకున్నూ, తేటతెల్లమే. ఆ ఆనందామృతాన్ని, ఆస్వాదించాలని వేగిరపడుతూవుంటారు కూడాను. కాని, వక్రనరాలలో చిక్కిన ఆ బక్కహృదయాలకుమాత్రం సౌఖ్యప్రపంచంలో స్థానంలేదు. ఆనందంమాత్రం ఆకాశకుసుమంగా మారి, అంతరిక్షంలో వికసిస్తుంది. కాని, సువర్ణచ్ఛాయలుమాత్రం, సామ్రాజ్యవాదుల హృదయాలలో ఆనందాన్నాశ్రయించి అవ్యాహతంగా రాజ్యమేలుతూవున్న సంగతి అగమ్యగోచరంగావున్నదీ పీడితవర్గానికి.

తెల్లవారక పూర్వమే నాలుగింటికి నడుంగట్టిన బీదప్రాణం ఘోరకార్యకలాపాల్లో నలిగి నలిగి, విసికి, వేసారి, రాత్రి పదింటికి కప్పులేకుండానే పుల్లలతోనల్లి బిల్లిగానల్లిన గుడిసెలోకి చేరుకుంటే సమయానికి చారెడు గంజికూడా దొరకదు కుతికతడుపుకోడానికైనా. సోదరులారా! ఆనిర్భాగ్యపు జీవితానికి, విశ్రాంతికి, దూరమెంతో గమనించవలసిన బాధ్యత మనయందేవుంది.

పగలంతా జీవితాన్ని క్లేశాగ్నికాహుతిజేసింది, పట్టె డన్నంకోసం అయినప్పటికీ, అది పిల్లలకే చాలని కారణమున, తిండిసంగతి మరచినట్టుగా, తన జీవితాన్ని నిద్రాదేవి కర్పిస్తున్నాడు.

సరే ఇక ధనవంతులసంగతి చూద్దామా అంటే, సామ్రాజ్యసౌధానికి, స్తంభాలుగా తయారయ్యారు. వాటికి పునాదిబలం చేకూర్చలేక హతమైపోతున్నారు ఈపామరవర్గం. ఈవిధంగా తొత్తుక్రింద బడితొత్తులాగా వారికివీరు, వీరికి వారు దాస్యంచేస్తూ, బానిస ప్రపంచంలో మగ్నమైపోయినారు.

ధనికవర్గాలు సామ్రాజ్యవాదులకుచేసే దాస్యానికంటే, పాటకజనం ధనవంతులకుచేసే శరీరదాస్యం, భావదాస్యం, కరడుగట్టిన మానవహృదయాన్ని, ద్రవీభూతం చేస్తుంది. హృదయానికి సాత్వికభావాన్ని, బోధిస్తుంది. మనః కోరకానికి విమల పరిణామాన్ని, నూత్నపరిమళాన్ని, అభినవచైతన్యాన్ని కలిగించి కలవరపెడుతూంది.

సహజ సాహసంతో, ధనవంతులకు సౌవర్ణసౌధముల నిర్మించిన, కార్మికుని శరీరం నిలవడానికి నీడలేక, ఎండకు ఎండీ, వానకు తడిసీ, ముడుచుకుపోయిన, ముడతలదేహం, దాహాము లేమిచే దహించుక పోతుంటే, ప్రేక్షకుని హృదయభాండం, సాత్వికరసావేశంతో, నిండి పటాపంచలవడంలో సందేహం లేదు. అహోరాత్రిలు నిద్రాహారాలకు స్వస్తివాచనమిచ్చి, శ్రమించి, జపించి, తపించి, సమస్తవస్తువులను పండించి, ధనవంతులపొట్టలు నిండించి, శేషించిన సౌభాగ్యాన్ని, కొట్టు

లలో, ఇనుపపెట్టెలలో పెట్టించి, పట్టెడన్నందొరక్క పక్షివలె తిరుగుతూవున్న నిరక్షరకుక్షియొక్క భిక్షుకస్వరూపం చూచిన మానవుని హృదయం కరిగి కాలువగా ప్రవహిస్తుందనడంలో, అతిశయోక్తిలేదు.

భూమిమీద విత్తనం చల్లిందిమొదలు ఎండలో ఎండై వానలోవానై, కష్టసుఖాల్ని లెక్కబెట్టక తానేరైతుగా సిద్ధమై, మొక్క మొలచినదిమొదలు పెంచి పెద్దచేసి, పండించి ధాన్యపురాసులు తీర్చిపెట్టే అంతవరకూ, ఈ కార్మికుడే దానియందాధిపత్యంవహించి, చివరకు ధనంగోల్పోయిన దీనుడిలాగా, బిక్కమొగంతో, రిక్తహస్తాలతో, తన పొల మెక్కడో తనెక్కడో దెలియక సోమరిపోతుల రాజ్యమేలుతూ వున్న సుకుమారవ్యక్తికి అర్పించి, నిట్టూర్పులవర్షాన్ని వర్షింప జేస్తూ, చెమటోడుస్తుంటాడు. ఈవ్యక్తినిచూస్తే, విశాలహృదయంగల మానవునిమనస్సెంత కుందుతూ కుళ్లిపో తుందోగదా? ఒక గ్రామాన్నేగాక, మరి ఒకదేశాన్నేగాక, దేశ దేశాంతరాలను, ఖండ ఖండాంతరాలను, దగ్ధంచేయడానికి తగిన పిరంగిబాంబుల్ని తయారుచేయగల శక్తిసామర్థ్యా లితని యందు ప్రతిబింబిస్తున్నప్పటికి, ఆకటిచిచ్చు పెచ్చుపెరిగి, ఆర్త ధ్వానాలతో, ఆత్మహత్య చేసుకున్నట్టు తనంతటతానే దహించుకుపోతున్నాడు.

ఈ విధంగా ఘోరదారిద్ర్య కార్యకలాపాల్లో నలిగి నశించుతూ, మర్మందెలియక కర్మమని సమాధానం చెప్పుకుంటూ, కార్మికులు కృశించడం భోగభాగ్యాలతో, పరిమళ

ప్రసూనాలతో, దివ్యసౌఖ్యా న్ననుభవించుచూ, పండించిన పంటను దండించి స్వీకరించుతూ, అదృష్టమని హాహా కారాలతో, హర్షించుతున్నారు ధనవంతులు. భారతయువకు లారా? ఇంతకంటె అధర్మంగానీ, ఇంతకంటె అన్యాయంగానీ, మరెక్కడన్నా వుందేమో పరికించండి. పగలు పరిమితిలేని పనిచేస్తాడు నిత్యకృత్యమన్నట్టుగా. రాత్రి వుపవాసానికి సిద్ధమై కృశించి నీరసించి కంపితహస్తాలతో, గద్గదస్వరంతో, వచ్చే మాటను భయంచేత, ఆపుకుంటూ, రానిమాటను పనిగట్టుకొని పెకలించుకుంటూ వున్న సమయంలో, యింకా జరగవలసిన భోగట్టా అంతా ముందేవుంది. తిండిగింజలు సంగతింకా అడగ నేలేదు, నుంచున్నవాణ్ణి నుంచున్నట్టు ధనికుడు తన ఆగ్రహాని కాహుతిచేస్తున్నాడీ కార్మికుని.

ఈవిధంగా దాస్యపు జీవితాలతో నిండి నిబిడీకృతమైన దేశం అంధకారాని కాహుతిగా తయారైంది. దేశంలో మర్మంలేని ధర్మం ధ్వంసమైపోయింది. అధర్మం అద్వితీయంగా రాజ్యమేగిస్తోంది. న్యాయం తపించి కృశించి నశించిపోయింది. అన్యాయమగ్రస్థాన మలంకరించింది. క్రమశః క్రుంగి కుమిలి కూకటివ్రేళ్లతో పీక్కుపోయింది. అక్రమం ఆరితేరిన నాయకుని మాదిరిగా అధ్యక్ష పీఠమలంకరించింది. అందువల్లనే నేడింత తీవ్రరూపందాల్చి దారిద్ర్య పిశాచం తాండవిస్తోంది దేశంలో.

ఈ దుర్భర దారిద్ర్యానికి కేవలం సామ్రాజ్యవాదులే గాకుండా ధనికవాదుల దౌర్జన్యాలు గూడా దరిజేరాయి. అన వరతం కన్నీటితో కాలయాపనంచేసే దరిద్రమూర్తుల్ని

చూస్తే, ధనవంతుల కనుగ్రహము గలుగదుగాని, ఆగ్రహం మాత్రం అణచిపెట్టినా ఆగకుండా బయలుదేరుతుంది. వీరి అనుగ్రహం ఎంతవరకూ, సామ్రాజ్యవాదుల వైపునకు ప్రసరిస్తుంది కాని, తిండిలేక మాడుతూవున్న, అన్నార్తుల వైపున కొచ్చే సరికి అనుగ్రహంకాస్తా ఆగ్రహంగా మారుతుంది. బీదలబాధల్ని నిరోధించాలనే సాత్వికభావాలు వీరి హృదయాల్లో, ఎన్నడు చలించవుగాని, నిష్కపటంగా శరీరకష్టంచేత సంపాదించిన పేదరైతులధనాన్ని సంగ్రహించడానికి, పెట్టుబడి విధానాలు వడ్డీవ్యాపారాలు వీరి హృదయాల్లో సులువుగా స్ఫురించుతాయి. ఈవిధంగా ధనికవర్గాలు. ఎవరి కనుకూలమయిన వ్యాపారాలు వారు సాగించుతూ, పీడితవర్గాన్ని ధనరూపేణా పీల్చి పిప్పిచేస్తూ, దాస్యరూపేణా చీల్చి చెండాడుతూవున్నాయి.

ఈ ధనికవర్గాల్లో, జమగట్టుకో తగిన జమీందారీవిధానాలు మాత్రం కొన్నిచోట్ల రైతులోకాన్ని నిలువునా అధోగతి పాలుచేస్తున్నాయి. ఈ జమిందారులు మొదట సామ్రాజ్యవాదులకు ఏజంట్లుగా సిద్ధమయ్యారు. ప్రజల దగ్గర శిస్తు వసూలు చేయడానికి. తరువాత క్రమక్రమంగా రైతుల్ని కాస్త వత్తిడిచేస్తూ, పాలకులకు సహాయం చేయడం ప్రారంభించారు తమ ఏజంటు బీజం బాగా పాతుకొనేవరకు. తరువాత ప్రభుత్వానికి మితిమీరిన సహాయం చేయడం ప్రారంభించారు. దానిని పురస్కరించుకొనే రైతులమీద తీవ్రమైన హుకుం

చెలాయించడం ప్రారంభించారు. మరికొన్నిచోట్ల నియమిత శిస్తును అతిక్రమించి ద్విగుణీకృతంగా గ్రహిస్తున్నారు.

అటువంటి సందర్భంలో రైతులకొచ్చే బాధలు మహా దుర్భరంగా వున్నాయి. గత్యంతరం లేక తబ్బిబ్బులవుతున్నారు. ఈ విధంగా జమిందారులు రైతుల్ని బాధించడం పాటకపు వర్గాన్ని ధనవంతులు దండించడం మహాబీభత్సంగా పరిణమిస్తున్నాయి ఇక్కడ ధర్మాలు.

ఇటువంటి అధర్మాల్లో పాలకులు పాల్గొని పరిష్కరిస్తారా అంటే! సరే ఇక ఆ శ్వేతజాతులకు దయాదాక్షిణ్యాలుగానీ, ధర్మాధర్మాలుగానీ, బురదలో కుమ్మరిపురుగు మాదిరిగా అంటనే అంటవువారికి. అటువంటి సందర్భంలో, వారి దగ్గరకు మనం వినయవిధేయతలతో పోయి, అక్రమంగా మీరు మా రాజ్యాన్ని వశీకరణచేసుకొని భోగించడం అధర్మంగావుంది గాబట్టి మా సంపద సౌభాగ్యాన్ని మాకివ్వండీ అనడం మనకెంత విస్మయ జనకమో, అడిగిన వెంటనే అరటిపండొలిచి చేతిలో పెట్టినట్టు ఇవ్వడం వారికంత విచారణీయం. దానికి మన కాంగ్రెసు నాయకులసాహసాన్ని కేవలం సహనశక్తిమీదకు పరువులెత్తిస్తారు. పాపం నిజంగా ఆసహ్యాతాశక్తియొక్క వుద్దేశమేమిటో దాని పరమార్థమేమైయుంటుందో కానసగాకపోతే కాస్తయినా గమనించినట్టు తోచదు. ఇదేమి వైపరీత్యం మహానుభావా అని యే యువకుడైనా హృదయాకదిలి అడిగితే గత్యంతరం లేకనేనని కచ్చితంగా తడుముకోకుండా చెప్పేస్తారు.

అది కేవలం "అందితే జుట్టు అందకపోతే కాళ్లు" అన్న సామ్యాన్ని పురస్కరించుకొని జుట్టుఅందకపోతే కాళ్లుపట్టు కొన్నట్టుగా వుంటుంది మన నాయకుల చరిత్ర. దాని లోనూ, ఈసహనాన్నే ఇరికించి వదలిపెడితారు చేయడానికి మరేమీతోచక

అయితే ఆ సహ్యాతాశక్తి యొక్క వుద్దేశమేమిటో వారు గమనించకపోయినా, మనం వివరించడం కర్తవ్యం గాబట్టి దాన్ని వివరించుదాం. సహ్యాత, అనే పదానికి సహించుట అని నిష్కపటంగా అర్థం చెబుతోందా శబ్దం. అందు వల్ల సహించడమే ఆ శక్తియొక్క పరమార్థ మని తోస్తుంది. అయితే సాధ్యమైనంతవరకు, చావగొట్టే శక్తి ఒకటుంటేనేగాని, సహించే శక్తి అంటూవుండదు గాబట్టి, సాధించేవాడొకడు సహించేవాడొకడుగా సిద్ధమవుతారింత వరకు. ఇది కేవలం వేదాంతవాదులకు, విరాగజీవులకు సహజ లక్షణమని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

నిజముగా మానవ సహజశక్తుల్ని చంపుకొని కృత్రిమ శక్తుల్ని అలవరచుకోవడం మనోదౌర్బల్యానికి మొదటిహేతు వవుతుంది. ఏరోజున మానవునియొక్క వుత్సాహం, సాహసం, ధైర్యం, బుద్ధి, పరాక్రమాలు, హృదయానికి స్వస్తిజెప్పి విర మించుకొన్నాయో, ఆరోజునే ఈ మానవుని అస్థిపంజరాల నాశ్రయించుకొని దాస్యనామస్మరణో, ఇంకా యేమీ తోచ నపుడు రామనామస్మరణో నెలవుచేసుకుంటూ ఆ వైరాగ్యం

వేదాంతం రెండే మిగులుతాయి. వాటిని ప్రాపంచికకాంక్షలాహ్వానించవు.

ఆహావభావాదుల ధమస్థితి నధిష్ఠించి రాజ్యమేలుతాయి. సహజశక్తులూకూ కృశించి నశించుతాయి. కృత్రిమ శక్తులు రెండుడయించుతాయి. ఈశక్తిద్వయంయొక్క పరమోద్దేశమేమిటో పరిశీలించడం మన కర్తవ్యం. వీటిపరమార్థం ప్రశాంతమైన శాంతి అని ఆయాశబ్దాలను పురస్కరించుకొన్న అర్థంవల్ల మనకు తేటతెల్లమవుతుంది. శాంతిఅనగానే సౌఖ్యానికి సంబంధించి వుంటుందని ఆ శబ్దార్థంవల్ల మనకు వ్యక్తమవుతుంది.

కాకపోయినా లోకవ్యవహారం గూడా, శాంతమూ లేకా సౌఖ్యములేదూ, అనేగీతికవల్ల శాంతమున్నచోటనే సౌఖ్యముంటుందని ప్రజాసామాన్యానికి సహజస్వభావమైంది మొదట. తరువాత పెద్దలు చెప్పిన సిద్ధాంతాన్ని దిద్దగూడదనే ధర్మంవల్ల పొరపాటుగా మారింది. క్రమక్రమంగా, కాలానుగుణ్యంగా, సాంఘికాచారగుణానుకూలంగా, అలవాటుగా అవతరించింది చివరకు. తరువాత శాంతంవల్ల మనం పొందవలసింది సౌఖ్యమైనప్పటికీ, దానికి వైరుధ్యంగా, కష్టాలనుభవిస్తున్నాం, కారణం కరుణించండి ప్రభూ అంటే, గ్రహపాటని కచ్చితంగా చెబుతారు పెద్దలు. పైపెచ్చు కర్మని గూడా మర్మంలేకుండా సెలవిస్తారు. ఇటువంటి అలవాటు పొరపాటు గ్రహపాటులు బుద్ధికుశలతా హీనత్వంవల్ల సంభవించే దోషాలని శాంతవాదులకు, తీవ్రవాదులకూ, అందరకూ, అర్థమయిన విషయమే,

కాని, శాంతవాదులకు శాంతమే, జీవనాధారం గాబట్టి శాంతం వల్ల లభించే క్లేశపరంపరలనుగూడా, ఆనందసౌధాలుగా అన్వయించుకుంటారు కృత్రిమవేషధారులై. అందువల్ల సత్య స్థానాన్నలంకరించిన శాంతమేదో, మిథ్యాభూతమైన శాంత మేదో, నిర్వచించడం దుర్ఘటసమస్యగా తేలింది. ఆవిధంగా మితవాదులకు, శబ్దార్థాన్ని నిర్వచించడానికి కృత్రిమభావాల్ని బయలు తెచ్చుకో గలిగినంత ఆవశ్యకత సంభవించినపుడు, ఆ పరిశాంతవాదుల కార్యకలాపాలింకెంత కృత్రిమవేషాన్నల వరచుకోవాలో, మనకే విశదమవుతుంది.

అందువల్లనే సాధించేవాడి చేతిక్రింద సహించేవాడు చావడానికి సిద్ధమైనప్పటికీ, శాంతవాదులకు సౌఖ్యాన్నే స్మర ణకు తెస్తూవుంటుంది శాంతి కాబట్టి అది శాంతమో, అత్యు త్కటమైన క్లేశమో, అర్థం తెలుసుకొన్న యథార్థవాదులకు విశదమవుతుంది. కాబట్టి కపటమైన భావప్రబోధల నుపసంహ రించుకొని, మనః ఫలకాన్ని విస్మృతిచేసి సాత్వికభావాన్ని స్థాపించుకొనుట ఆనంద సౌధానికి ప్రథమసోపానం. సాత్విక మనగా పరగత సుఖదుఃఖములను తన అంతః కరణచే భావన చేయుట.

ఇటువంటి సాత్విక లక్షణలక్షితుండైన మానవుడు ఏ ప్రయత్నాన్ని నిర్వర్తించాలన్నా దేశకాలపరిస్థితులను మాత్రం తన దృక్పథంలో పెట్టుకొని కార్యసాఫల్యానికి సంసిద్ధుడవ్వాలి. అంతేగాని, నేబట్టుకున్న కుందేటికి కొమ్ములు మూడేనని వేద పురాణాలను అడ్డంత్రోసి వాదించడం వారధ్యయనం చేస్తూ

వున్న వేదాంత మహిమా విశేషంగాని ఆధునిక విజ్ఞాన లక్షణం గాదు. అయితే ఆధునిక విజ్ఞానం శాంతిని నిరసించుతుందా అంటే ఎన్నటికీ అలాజరగదు. ఇంతమాత్రంలోనే తీవ్రవాదులు శాంతిని కేవలం తృణీకరిస్తారనిమాత్రం ఎన్నడూ తలంచవద్దని విన్నపం.

ఎందువల్లనంటే మన మెన్ని ప్రయత్నాలు నిర్వర్తించి స్వరాజ్యసంపదల ననుభవించాలన్నా, దేశవాసుల శాంతి కొరకేగాని, అశాంతికోసం గాదుగదా. అందువల్ల సాధ్యమైనంతవరకు శాంతినే ప్రయోగించి సాఫల్యంపొందడం శాంతవాదులకు తీవ్రవాదులకు సుగమంగానే వుంటుంది. వాద ప్రతివాదాలు లేకుండా ప్రశాంతంగావచ్చే సంపత్ సౌభాగ్యాల కోసమై, దౌర్జన్యాలుపయోగించడం నిరర్థకమని అందరకూ తెలిసినవిషయమె, అయితే అన్నివిషయాల్లోనూ, అన్ని సమయాల్లోనూ ఈశాంతే అన్వయిస్తుందా అంటె, వెగటుగా వుంటుంది కొన్నిచోట్ల. శాంతిని ప్రయోగించేస్థానాన్ని గమనించి సమయానుకూలంగా సందర్భానుసారంగా ప్రయోగించి సాఫల్యాన్నిబొందాలి.

అంతమాత్రమేగాక లోకంలో భిన్నభిన్నరీతుల మానవ మనోవిజ్ఞానాన్ని పురస్కరించుకొని, ఇతరుల శక్తియుక్తులను గమనించి, మన యుపాయకౌశలాన్ని ప్రయోగించి సాఫల్యాన్నిపొందాలి. తరువాత సామదానభేద దండోపాయాలను క్రమపద్ధతిలో నడిపించుట మానవలక్షణం. అంతేగాని హస్తగతమైన వస్తువును దోపిడిచేస్తున్నవారి విషయంలోగూడా

శాంతే స్మరణకొచ్చి సామోపాయాన్ని ఉపయోగిస్తే, వచ్చే ఫలిత మెంతుంటుందో, ప్రకృతమైన మనవిషయానికీ అంతే వుంటుంది ఫలితం. నిజంగా శాంతికి పాత్రుడైతే అక్రమానికే వడిగట్టుకోడు. కాబట్టి మన వస్తువును స్వీకరించడానికి ఏ యుపాయమావశ్యకమని తోస్తుందో ఆ వుపాయాన్నే ప్రయోగించి ఆవస్తువును వశీకరణచేసుకోవడం ఆధునిక విజ్ఞానలక్షణ ప్రభావం.

అయితే ఈ విజ్ఞానం అందరియందూ ఒకే విధంగా వుండి పరస్పర సామరస్యాన్ని నెలకొల్పుతున్నదా అంటే లేదు. ఇటు ధనవంతులకు పామర జనానికి భేదభావాలేలా వున్నాయో, అటు సామ్రాజ్యవాదులకు ధనికవర్గాలకు ద్వేషభావాలావిధంగా ప్రబలివున్నాయి. అందువల్ల మనంముందు నిర్వర్తించదలచుకొన్న స్వరాజ్యపోరాటనికి గమనించవలసిన విషయాలు చాలావున్నాయి. కాబట్టి కార్మిక సంఘాలుగాని కర్షకసంఘాలుగాని, స్వరాజ్యసాధనాన్ని సాధించి సర్వసమానత్వాన్ని నెలకొల్పుకోవాలంటే ప్రభుత్వపోరాటానికి ముందుగా నెదుర్కొనవలసిన ఘర్షటవర్గమొకటుంది. అదే ధనికవాదం. అటువంటి ధనికవాదాన్ని దగ్ధంచేయాలి. పెట్టుబడిదారీ విధానాన్ని రూపుమాపాలి. అటువంటి సందర్భంలో సామ్రాజ్యవాదం అట్టె సమసిపోడానికి కవకాశముంది. ఎందువల్లనంటె సామ్రాజ్యసౌధానికి ధనికవర్గాలు స్తంభాలుగా తయారైయ్యారు. అటువంటి స్తంభాలు నరికినతరువాత

సౌధం తలక్రిందులయ్యే సంగతి సామాన్య మానవజాతి కంతకూ తెలిసినవిషయమే.

అయితే భారతీయుల్ని భారతీయులే దగ్ధంచేసుకోవడమా అని విరమించుకోవడంమాత్రం భారతీయులకు లక్షణం గాదు. "ధనమూల మిదంజగత్" అన్నట్టుగా ప్రపంచమంతా ధనస్వరూపంబాల్చి లోభమోహ మద మాత్సర్యాల కాటపట్టుఅయింది. బూటకనాటకాలతో కాలచక్రం కలవలె మారిపోతోంది. దేశంలో ఆత్మహత్యలు పరహత్యలు దోపిడీ వ్యాపారాలు అవ్యాహతంగా జరుగుతున్నాయంటే, సామాన్యంగా మూడువంతుల ముప్పాతిక ధనవిషయకమైన కల్లోలములచేతనే కలతలు బయలుదేరుతున్నాయి.

కాబట్టి దేశంలో ధనానికి స్వరూపం లేకుండానేవుండి మానవజీవితాని కావశ్యకపదార్థాల నన్నిటని సృష్టించుకొని వస్తువినిమయముద్వారా సమర్థించుకొన్నట్టయితే, ఒకదేశాన్ని మరొకదేశం అమాంతంగా మ్రింగుదామన్నంత క్రోధపూరిత పౌరుషా లావేశించడంగాని, త్రుటిలో అరువయినాలుగబద్ధాలాడడంగాని, తటస్థించేవి గావనుకొంటాను.

ఇంతేగాకుండా కంటికందని కాంక్షాలతలు జనించడమే దుర్లభమయ్యేవి. లేనట్టయితే, సోదరులారా ? తమ వాస్తవిక దృష్టిని కాస్త లోకానికి ప్రసరింపజేయండి. దేశములోవున్న పారస్పరికభావవైషమ్యాలు, అంతులేని ఆశలతో నిండిన కలకల నినాదాలు, చిన్నవర్గం పెద్దవర్గానికి దాస్యంచేయడం, పెద్దవర్గం చిన్నవర్గాన్ని తమతమ సౌఖ్యాని కావశ్యక వస్తుపరికరాల

కాహుతి చేసుకోవడం, రాక్షస రాజ్యంలాగా, అధర్మాలు, అక్రమాలు. అన్యాయాలు అన్నీ మీకు ప్రత్యక్షమవుతాయి.

ఈ అధర్మాలతోపాటు అజ్ఞానంకూడా పూర్తిగా నావరించినట్లు తోస్తుంది. దీనికితోడు బానిసవ్యాపారం స్థిరముగా నాటుకుపోవడం గూడా ప్రబలతార్కాణంగావుంది. ఇటువంటి దేశములో మన బంధువుగాదు మన సాంప్రదాయంగాదు, మన అవివేకత్వాన్ననుసరించి అధికారం చెలాయించడానికి హాజరయ్యారు సామ్రాజ్యవాదులు. అయితే వీరి ప్రధానమయిన వుద్దేశాలేమిటో తెలుసుకుందాం.

వాద ప్రతివాదాలతీర్పులు నేర్పుతో నెరవేర్చడం, దేశానికి తగిన సదుపాయాలను సమకూర్చడం, తరువాత దానికి తగిన కార్యభారం నిర్వహించడానికి ధనం పన్ను రూపేణా వసూలుచేయడం వారు ప్రధానాదర్శాలుగా పెట్టుకొన్నారు రాజ్యస్థాపన బలపరచుకోడానికి. ఇక పాలకుల ఆదర్శాలు పాలితులను దుర్భరమైన దుస్థితిలోకి తీసుకురావడాని కానుకూల్యంగా వుంటాయి. వీరు నిరంకుశమూర్తులు. సాత్వికభావాలకు వీరి హృదయాలకూ దూరం చాలావుందని చెప్పడంలో సందేహంలేదు. అందువల్లనే స్వతంత్రించి నోరు మెదల్చేదిక్కులేక మనం బాధపడుతున్నాం. ఆవలించితే పేగులు లెక్కబెట్టి రికార్డుతయారుజేస్తున్నారు వారు.

వారు ఏర్పరుచుకొన్న ఆదర్శాలు కొన్ని వుంటాయి. ఆ యాదర్శాలను పొందే అంతవరకూ వారి బాధ్యత పూర్తిగా ప్రబలివుంటుంది. అదే వారి జీవితానికి పరమావధి అని చెప్ప

వచ్చు నిష్కపటంగా వారి కర్తవ్యం అది గాబట్టి. ముందు వెనుకలు పారజూడకుండా వారు ఆదర్శాలను పొందేలోపల ప్రజలెంత కష్టపడతారో అన్నవిషయంలో మాత్రం వారు జోక్యం కలిగించుకోరు. కారణాంతరాలవల్ల వారి ఆదర్శాలను పొందేలోపల ప్రజల్లో కొందరి ప్రాణాలు పోవడానికి సిద్ధమైనప్పటికీ ఆదర్శాన్ననుభవించాలన్న విషయం మాత్రం విస్మరించరు. అందువల్ల ప్రజాసామాన్యం అధోగతి పాలవుతోందని చెప్పడంలో సందేహంలేదు. సరే వారి తరువాత కొంచం తక్కువలో పీఠమర్దుల్లాగా ధనవంతులు బీదసాదల్ని బాధించి బంధిస్తున్నారు. అందువల్ల ఏలోటుపాట్లు భారతదేశాన్నధమ స్థితికి తీసుకొచ్చాయో, వాటినే తిరిగి వృద్ధించుకొని దేశ దాస్య విమోచనంచేసుకోవాలి.

ఆదిలో అజ్ఞానం అంకురించి భారతీయుల్ని బాధపెట్టిన సంగతి అందరికీ తెలిసినవిషయమే. దాన్ని పురస్కరించుకొని బానిసవిధానం పూర్తిగా ఆవరించింది. ఆతరువాత స్వాతంత్ర్య రహితులమవడంలో విస్మయమే లేదుగదా? అందువల్ల సహజంగా వున్న మానవుని వుత్సాహాన్ని సాహసాన్ని ధైర్యాన్ని శక్తిసామర్థ్యాల్ని అన్నిటిని చంపుకొని, కృత్రిమవేషాన్ని ధరించి ఆ భయాన్ని భక్తిని ఆశ్రయించాం.

అందువల్ల విజ్ఞానమున్నప్పటికీ అజ్ఞానుల పట్టికలో చేర్చుకోబడ్డాం. ధైర్యమున్నప్పటికీ అధైర్యంగా ప్రవర్తిస్తున్నాం. సహజసాహసాన్ని చంపుకొని సాహసరహితులంగా ప్రవర్తిస్తున్నామంటే స్వాతంత్ర్యరహితుల మవడంచేతనేగాని, శక్తి

సామర్థ్యాలు తక్కువయినందువల్లగాదు. అందువల్ల ఇటువంటి కపటనాటకం మనం నటిస్తున్నామంటె, సామ్రాజ్యవాదుల డాంబిక దౌర్జన్యాలముందరఆగలేక పోయామని కచ్చితంగా చెప్పడంలో సందేహంలేదు. అందువల్ల ఇటువంటి కపటరాజ్యాన్నుండి మనం తప్పించుకోవాలి.

దివ్యజ్ఞానాన్ని ప్రవేశపెట్టి దేశాన్ని దేదీప్యమానంగా ప్రజ్వలించే టట్టు చేయాలి. ఏ ధైర్యసాహసాలను సామ్రాజ్యవాదులనుండి మనం పొందే భయభక్తుల కాహుతిచేసి అధమస్థితి ననుభవిస్తున్నామో, ఆధైర్యసాహసాలనే గాక, ఆనిర్వక్రపరాక్రమాన్ని ఆనైజక ప్రతిభాప్రభావాన్ని, ఆమసీపావిశేషాన్ని విజృభింపజేస్తూ, భావదాస్యాన్ని భస్మీపటలం చేయాలి. శరీరదాస్యాన్ని చీల్చిచెండాడాలి. మానసికదాస్యాన్ని మంటలపాలుచేయాలి. పిరికి వృక్షాన్ని కూకటివేళ్ళతో పెరికి పారవేయాలి. విక్రమవృక్షాన్ని సక్రమంగా పెంచి పెద్దచేసి స్వాతంత్ర్యఫల రసాస్వాదనం చేస్తేనేగాని భారతజాతికి శాంతి సంప్రాప్తించదు.

కాబట్టి శాంతి అనే పదానికి సౌఖ్యం ఇప్పుడు సమీపములో వుంటుంది. అక్రమాలు అంతర్థానమయిన తరువాత, అన్యాయాలంతరించిన తరువాత పుష్కలమైన భోజనపదార్థం నిష్కళంకమయిన జీవితానికర్పించిన రోజునే మానవజీవితానికి శాంతి. దాని పరిణామసిద్ధే సౌఖ్యం. ఆసౌఖ్యాతిశయమే ఆనందం. ఈవిధంగా మానవజీవితానికి. శాంతిసౌఖ్యం సంతోషం హృదయపీఠంలో అధిష్ఠించినరోజునే సార్థకమైన శాంతి,

శాంతిదాయకమైన, ప్రశాంతమైన శాంతి, ప్రకాశిస్తుంది. అంతే గాని మన కాంగ్రెసు నాయకశిఖామణులు సెలవిచ్చినట్టు శాంతి మితిలేని క్లేశాలకు మిత్రతుల్యంగా ఉండదు. భారతయువకులారా? శాంతి అనే పదాన్నిమాత్రం, తిరస్కరించమని, పై చెప్పిన నా విషయాన్ని విస్మరించవద్దని నావిన్నపం. శాంతి మాకు, మీకూ, మరొకళ్లకు, ఇన్నెందుకు, ఈ రమణీయ ప్రపంచంలో జనించిన మానవ పశు పక్షి పిపీలికాది యావ జ్జీవులకు, ఆవశ్యకమైనదే.

అయితే, సమయానుకూలంగా సాగనిస్తూవుండాలి ఈ శాంతి రథాన్ని. అంతెగాని ఇల్లుగాలేటప్పుడు శాంతమే భూషణమనే సూక్తిని తీసుకొనిగాని, కల్లుత్రాగేటప్పుడు శాంతమే అసహ్యమని తీవ్రత్వాన్నుపయోగిస్తే, వచ్చే ఫలితాలేలావుంటాయో, సమయానుకూలంగా, వుపయోగించని శాంతిఫలితాలలావుంటాయి.

సరే, ఇక శాంతివాదులు సెలవిచ్చే శాంతి ఎలా వుంటుందో, విచారిద్దాం. సామాన్యంగా ఈశాంతి రెండువిధాలుగా వుంటుంది. పంచభక్ష్య పరమాన్నాల్ని సేవించి, పరపీడితభావదాస్యాన్ని ధ్వంసంచేసి, పవిత్రమైన ఆనందాతిశయాన్ననుభవించడం, ప్రశాంతమైన శాంతికి లక్షణం, మొదటిది. ఇక రెండోశాంతి, ధనవంతుని డాంబిక దౌర్జన్యాల కాహుతిగామారి, ఎముకలిరిగేటట్టు పనిచేసి, చారెడు గంజికి గజబిజగా తయారయి, మలమలమాడి, కుమిలి, కృశించి కూర్చున్నవారికి, ఇంద్రియాలదుపులోవుండడం దుర్లభం. జర

రాగ్ని చల్లారడానికి సిద్ధమవుతుంది. ప్రాణంకంఠం పైకివస్తుంది ప్రశాంతమైన శాంతాకాశములో వాయులీనంగావడానికి, ఉత్సాహాన్ని, సాహసాన్ని, ధైర్యాన్ని, గతక్లేశాలతోనే తిలోదకాలొదులుతాడు. అప్పుడు, ఆ యాకారాన్ని జీవమని నిశ్చయంగాచెపడానికి వీల్లేదుగాని, జీవచ్ఛవమని చెప్పడం సమంజసంగా వుంటుంది.

అపుడతని పంచప్రాణాలు, షట్ఛక్తులు, అనంతాకాశ పథంలోవిహరించడానికిసుముఖంగావుంటాయి. ఆ సమయంలో వానిశాంతికి మితిలేదు. అది తెలియనిశాంతి. ఈవిధంగా జీవితానికి శాంతి రెండువిధములుగా వుంటుందని, నా పరిపూర్ణ విశ్వాసము.

ఇందులో, రెండోశాంతి మన మితవాదులకు అనుకూలంగా వుంటుందని, వారి వుపన్యాసాలవల్ల మనకు వ్యక్తమవుతుంది. ఈ శాంతిద్వయంలో, ఏది మనకసాధ్యమైనసంపద సౌభాగాన్నిస్తుందో, ఏశాంతి మనకు, అనిర్వాచ్యమైన ఆనందాన్ని ప్రసాదిస్తుందో, ఏశాంతి మనకు, అక్రమాల నణగద్రొక్కి, క్రమాలనే కార్యరంగంలోనికి కదముద్రొక్కిస్తుందో, ఉష్ణరక్తం చింముతూవుండే, యువకశిఖామణులకే అర్థమవుతుంది.

ఇక, ఇటువంటిసందర్భంలో, మన మితవాదుల వుపన్యాసాలేలావుంటాయో గమనించుదాం. దానికి ముందుగా, ఈ చిన్నపొత్తాన్ని, పక్షపాతభావాలు పటాపంచలు చేసి వ్రాస్తున్నానని మాత్రం, గమనించి విశ్వసించవలసిన బాధ్యత, మీ యందు పూర్తిగా ప్రబలివుంది.

మనోదార్ఢ్యాల్యాన్ని పురస్కరించుకొని, ఇటు ధనిక వర్గాలకు, అటు కార్మికవర్గాలకు, నొప్పిలేకుండా కపటాను సారముగా, హృద్గత వృత్తాంతమొకటైతే, బయల్పరచే విష యాన్ని మరోవిధంగా మార్చి కూర్చి సున్నితంగా మాట్లాడ తారు మితవాదులు. కారణమేమంటే? ఎలుకను, పిల్లిబడితే, పిల్లిని, కుక్కబట్టినట్లు, దరిద్రుల్ని ధనవంతులు పీడించడం, ధన వంతుల్ని సామ్రాజ్యవాదులు సాధించడంగా తేలింది ఇక్కడ న్యాయమైన వ్యవహారం. అయితే అక్కడ మన నాయకులు ప్రసంగించే, ఉపన్యాస రసచమత్కృతి, ధనవంతుల టీపార్టీ లకూ, పూలదండల పరామర్శనలకు లోటువాటిల్లుతుందనే భయంతో, చక్కని శైలితో, ధోరణిమార్చి, సహజభావం నశించి కృత్రిమభావం బయలుదేరి భాగ్యవంతులకు బాధలేని ఉపన్యాసంగా పరిణమిస్తుంది.

సరే ఇక కార్మికసంఘాలనుగాని, కర్షకసంఘాలనుగాని, దూషించడాని కవకాశమే లేదు గదా! లేక అవకాశమున్న ప్పటికీ, వాళ్లచివాట్లకు గురికావలసి వస్తుందనే భయముతో, క్షుద్బాధను దీర్చని వేదాంతాన్ని, సౌఖ్యాన్నివ్వని వైరా గ్యాన్ని, సులువుగా వేదపురాణాలను నిరూపించుతూ, సంకుచితభావాలను సావధానంగా బోధిస్తారు. ఇక్కడను ప్రత్యక్షంలోవున్న రెండువర్గాలవారిని, పూజించే వదలిపెడ తారు భయంచేతనో భక్తిచేతనో. సరే, ఇంతవరకూ, కపట నాటకసూత్రధారుల్లాగా బయలుదేరి, అందరినిభూషించే వదలి పెట్టారు. వందిమాగధులమాదిరిగా పొగడుతూకూర్చుంటే,

సభలో కల్లోలం బయలుదేరుతుందని గ్రహించి, కాస్త స్వస్థత చేజిక్కించుకొని, లేనిపోని ధైర్యాన్ని, పళ్ళముందుకు దెచ్చుకొని, అక్కడికీచిత్తవిభ్రమం ద్విగుణీకృతమై భీతినిగొల్పే హృదయంతో, నలువైపులా సి. ఐ డీల కలాల కదలిక లేకుండా వుండడంజూచి, వ్యంగ్యంగా, ధ్వనించేలట్టుగా, దగ్గర లేని ప్రభుత్వాన్ని, ద్వేషిస్తారు.

అక్కడత్తో, తలప్రాణం తోకకొస్తుంది మన మితవాదులకు. దానితో, ఈస్వల్పసంతోషస్వాంతాలకు కదలికగలిగి చప్పట్లవర్షం కురిపిస్తారు. మరీసమీపంలోవున్న ఉపనాయకులు, పూలవర్షాన్ని వర్షింపజేస్తారు. ఈవిధంగా మితవాదుల ఉపన్యాసాలు చిత్ర విచిత్రంగావుంటాయి.

ఇక,కచ్చితంగా హృద్గతవృత్తాంతానికి యథార్థస్వరూపమిచ్చి, నిష్కల్మషహృదయంతో పేదల హృదయపాదులను, కదలగొట్టి, అజ్ఞానగ్రంథులను, పటాపంచలుచేసి, దివ్యజ్ఞానజ్యోతిని ప్రవేశపెడతారతివాదులు. ధనవంతులు బీదవాళ్లను పెట్టేబాధల్ని చేయించుకొనే శరీరమానసిక దాస్యాల్ని, ఆకటిచిచ్చుతో చచ్చు పీనుగులై అన్నమో, అన్నమో, అని అలమరుగువారివంక కన్నెత్తి చూడక, మిగిలినరక్తాన్ని పీలుస్తున్న రక్త పిపాసుల శక్తిసామర్థ్యాలను, కన్నుల కట్టినట్టు తాండవింపజేస్తారు.

అప్పటికి, ఈపాటక వర్గానికి, కాస్త నూతన చైతన్యం కలుగుతుంది. తరువాత దరిద్రబాధలు, దాస్యపు నడకలు, ప్రతిబింబిస్తాయి వారి హృదయదర్పణంలో. తరువాత ఈనైచ్యాన్ని

సహించడం దుర్భరమనితోచి వానితో ఏటిమర్మాలేవో, తెలియ జేయండి బాబుల్లారా? అని వుదారస్వభావంతో వచ్చీ రాని మాటలు మాట్లాడిన పసిపిల్లడు మాదిరిగా, విద్యలేని దోషం చేత, నచ్చులు గొట్టుకుంటూ, నాలుక తడబడుతూ మర్మమంటే ఏమిటో, దెలియని కార్మికులు, నోరు తెరచి అడిగితే, పక్కలో బల్లెంలాగావున్న ఇంగ్లీషువారి భాషను బయటకు లాగి, అర్థ గంటసేపు అయోమయావస్థలో, మునిగి తేలి అడిగిన ఈ బీద జీవితాన్ని, షటప్ అంటాడు పిడుగు బడ్డట్టు. పాప మాపేదజీవితానికి దానియర్థం తెలియనూ, దెలి యదు. తెలుసుకోవాలన్నంత తమకం, గూడా గలుగదుగాని, సహజసౌందర్యంతో, తొణికిసలాడుతూవున్న, ఆవదనార విందంలోంచి, పెనుభూతంలా వచ్చిపడిన, ఆశబ్దాన్ని చెవ్రులతో వినకపోయినా, హృదయానికి వజ్రఘాతమయినది గాబోలు, పూర్వక్షణంలో తెరచిఅడిగిన నోరు, మరుక్షణంలో, మూసుకపోవడమే గాకుండా, నోటికి చేయికూడా సహాయం చేసింది, కర్మజాలకతిరిగి తెరుస్తాడేమోనని, సోదరులారా? ఆ రెండక్షరాలమాటకే, హడలిపోయి, ఆపాదమస్తకం కంపిత స్వాంతుడైనవాడు, వివర్శించి అవగాహన చేసుకుందామన్న కుతూహలంగలవాడేలా అవుతాడో, మీకే అర్థమవుతుంది.

*

ఎప్పటినుంచో ఇప్పటివరకూ, ఈ ఘోరదారిద్ర్యమునకు గాని, ఈ నికృష్టదైన్యజీవిత వ్యాపకానికిగాని తనేగాక, తన కుటుంబ సర్వస్వాంతర తరాలవరకూ, ఈ హైన్యజీవనమే బీదల హృదయపాదుల్లో కరడుగట్టి కరగడంలేదాంట? ఇదిగో

ఈ అడిగి తెలుసుకొనే భాగ్యంకూడ లభించని కారణమేనని స్ఫుటంగా అందరికి స్ఫురించుతోంది.

అయితే ఇటువంటి డాంబికప్రచారానికీ, పార్జన్య రాజ్యానికీ, కేవలం ధనవంతుల విజ్ఞానవైపరీత్యమూ, లేక ధనమదాంధులవడంచేత కన్నూమిన్నూ గానక, నెరవేర్చిన దారుణకార్యకలాపాలా? అని ప్రశ్నించుకుంటె, మన కవగాహానమయ్యే విషయమొక్కటుంది.

అసలు, ఈ అనంత విశ్వాంగణంలో, సమస్తవస్తువులూ, రామణీయకాన్ని రంజిపజేస్తున్నాయి. నవ్యనాగరికత్వాని కానుకూల్యమైన, పదార్థజాలం, పండి నిండి దండిగావుంది. హృదయాని కమందానందాన్ననుగ్రహించాలంటేగాని, శరీర సౌఖ్యాన్ని సమకూర్చాలంటేగాని, కన్నులకు మిన్నంత పండుగలను ప్రదర్శించాలంటేగాని ఈవిశ్వాంగణమే సమర్థమయింది.

ఇంత సంతోషసౌరభాన్ని, ఇంపుసొంపులతో సంతరింపజేసే, సంపదరావడానికి, మార్గమేదోనని, విచారించుకుంటే, వైజ్ఞానికుల శరీరమానసిక నైపుణ్యవిశేషమని మనకు సులువుగా బోధకమవుతుంది. ఎంతవస్తుసంచయమున్నా, అందమూ, అన్ని రకాల వస్తువులను సృష్టించుకో గలుగుతున్నారుగాని, ఒకడే వలసిన పరికరసముదాయాన్ని సమకూర్చ లేకపోతున్నాడు. దానికి కేవలం విజ్ఞాన హైన్యమని మాత్రం చెప్పడానికి వీల్లేదుగాని, దేశకాలపరిస్థితుల మార్పువల్ల సమకూర్చుకో లేకపోతున్నాడనిమాత్రం వ్యక్తమవుతోంది. తరువాత వస్తువినిమయము తగ్గినట్టు తోస్తుంది. అందువల్లనే ధనానికి విలువ

అధికమయింది. ఎందువల్లనంటే స్వయంకృతవస్తుజాలం చాలక మిగతా తన కావశ్యక పదార్థాలను, స్వీకరించాలంటే, ధనం మితిలేని అవసరమనిపించింది. ఆవిధంగా కాలప్రవృత్తులు పరిణ మించుతూ వుండేసరికి, స్వయంగా వస్తువులను, తయారు చేసుకోవడం బద్ధకమై, సోమరిపోతులుగా సిద్ధమయ్యారు కొందరు.

ఆ సమయంలో, వస్తూత్పత్తిచేసే వైజ్ఞానికులు తక్కు వయ్యారు దేశంలో.అపుడే వస్తువులకుగూడా,విలువ హెచ్చింది. దాని ననుసరించే, ధనానికి అంతులేని అవసరం సిద్ధించింది. లేక కష్టపడి వస్తువులను తయారుచేసినవాడే, ఈ సౌఖ్యాంబ రంలో విహరించాలిగాని, సోమరిపోతులకు, ఈసౌఖ్యం అనవ సరమని చెపడానికి, అధర్మాలు ఆకాలంలో జీర్ణంకాలా. అంత టితో, వస్తుసృష్టినిచేసే సృష్టికర్తలకంటె, ముష్టికర్తలకు, ధనం చాలా అవసరమనిపించింది.

తినే తిండిదగ్గఅనుంచి, కట్టేబట్టగూడ కొనవలసివచ్చింది గాబట్టి, ఈవిధంగా ధనాన్నిమార్చి, వస్తువులను తీసుకొనే సోమరిపోతులు, వస్తువులనుమార్చి ధనాన్నిగ్రహించే మహాను భావులు, బయలుదేరారు. కాలుక్రిందబెట్టని సుకుమార మూర్తులకు లెక్కలేనంత ధనమవసరమన్న సంగతి సర్వజన విదితమేగదా? అక్కడనుంచి డాంబికాలు, దౌర్జన్యాలు, దోపిడీవ్యాపారాలు, సాగించి మిగిలిన కార్మికులకు కర్షకులకు పాటకజనానికి, వారి వారి మూఢత్వాన్ననుసరించి, కొన్ని

ధర్మాలు, మరికొన్ని నీత్యుపదేశాలు, నూరిపోసి, ధనాకర్షణ యంత్రాన్ని ప్రయోగించి కార్యసాఫల్యాన్ని పొందుతున్నారు.

అక్కడనుంచే, దోపిడీవ్యాపారాంకురాలు, పొటమరించాయి దేశంలో. క్రమక్రమంగా, ఆసోమరిపోతులే లక్షాధికారులుగానూ, కోటీశ్వరులుగానూ, సిద్ధమయ్యారు. దోపిడి దోయించుకొన్న పామరవర్గం నేడు భిక్షాధికారులై మనకళ్ల ముందు ఇల్లులేని కారణంవలన ప్రతిబింబిస్తున్న సంగతి అందరికీ అర్థమైన విషయమే. లేక శరీరకష్టంచేత కేవలం కోటీశ్వరులైన వాళ్లు మనదేశంలో చాలాతక్కువేనని నాయనుభవం.

ఎందువల్లనంటె, ఆవిధంగా కష్టించినవాళ్లు కోటీశ్వరులైనట్టయితే ఈరోజున భారతదేశంలో, కార్మికవర్గం కర్షకవర్గం పాటకజనం లక్షాధికారులై హంసతూలికా తల్పాల్లో సంశయంలేకుండా ఆనందించదగ్గవారే? అందువల్ల ఆధర్మం, అక్కడ, అన్వయించకుండా, కష్టించినవాడే, భ్రష్టుడైపోవడం. సోమరిపోతు సౌఖ్యాన్నిపొందే ధర్మం తయారైంది. కాబట్టి దోపిడి వ్యాపారాలు దొంగవ్యాపారాలూ లేకుండా, కష్టంతోనే కాంచనవర్ణసౌధాలు నిర్మిస్తున్నారనిమాత్రం తలంచవద్దు. నిజంగా ఒకధనికుడు మేడగడుతున్నాడూ, అంటే ప్రక్కన పది కొంపలు అమాంతంగా ఆరుపుతున్నాడనే అర్థంచేసుకోవాలి కాని, కష్టించి కడుతున్నాడని మాత్రం తలంచవద్దు. ఒక ధనవంతుడు సరదాగా ఆకాశవిమానమెక్కి, అంతరిక్షాన సంచరిస్తున్నాడంటే? ప్రక్కన వందమంది పాటకజనం పడిగాపులుబడుతూ

నడవలేక బాధపడుతున్నారని సులువుగా బోధకమవుతుంది మనందరకు.

• అయితే మొదటనుంచీ జరుగుతూవున్న ఈ దోపిడి వ్యాపారాలకు, కొన్ని తాంత్రిక మంత్రోపదేశాలు, శాంతి సమరసన్నాహాలు ప్రధానాంగాలుగా బట్టి. అగ్నికి వాయుపు సహాయమైనట్టు, ధనవంతులకు, ప్రజల అమాయకత్వాన్నను సరించి, బ్రాహ్మణుల మనిపేరు బెట్టుకొన్న వింతజాతి కొంత, సహాయంచేయడం మొదలు పెట్టింది.

వీరు సామాన్యంగా, అప్పుడు ధనంసంపాదించిన సోమరి పోతులకు, సహాయకార్యదర్శులుగా నుండేవారని తోస్తుంది. కారణమేమంటే? అప్పటి వారిలో వీరే విజ్ఞానవంతులని చెప్ప డంలో సందేహంలేదు. అందుకు జీవనోపాధికి వారినే ఆశ్రయించారా? సౌధనిర్మాణాలుచేసి రానురాను సోమరిపోతులు సౌభాగ్యాన్ని పొందడంతోనే, వారికి మార్గదర్శకులై, మంత్ర శాస్త్రాలు బోధించిమంత్రిత్వాన్ని స్వీకరించారా?తరువాత వారి జుట్టుకాస్త వీరిహస్తగతమై పోయినది. అక్కడనుంచి బ్రాహ్మణజాతి ధనవంతుల్ని వేదపురాణాలతో, నీతిశాస్త్రాలతో వశపరచుకున్నారంటే, మనం విస్మయమొందే, అవసరంగూడ వుండదు. వారి ననుసరించే వారికింక దాసులుగాబట్టి, కార్మి కులు, కర్షకులు, పాటకవర్గం, అంతా అమోదించిందా సిద్ధాం తాన్ని, తదితర వర్గాలకంటె, ఈబ్రాహ్మలేరోజున, తెలివిగల వా రనిపించుకున్నారో, ఆరోజునే పండిత శాలువాలతో పీఠా న్నధిష్ఠించారు.

సామాన్యంగా, తెలివెంతమాత్రం లేని మూఢజీవికి, తెలివిగలవాళ్లను చూస్తే భయంలేదు గాని, ఒక విధమైన జ్ఞానంగలవాడికి, తనకంటె ద్విగుణీకృతమైన జ్ఞానంగలవాణ్ణి చూస్తే భయము భక్తి రెండూచేరి, తన కతీతమైన దేవుడిలాగా తయారుచేస్తాయి ఆతలకాయగల వ్యక్తిని. ఇక ఆపండితుని నోట్లోనుండి వచ్చినమాటంతా, అమృతప్రాయంగా వుంటుంది. ఈ అమాయకపు జీవితాలకు, నిజంగా పండితుల బుర్రల్లోనుంచి స్రవించిన పదార్థమే వేదపురాణాలుగా పరిణమించాయి వాటిని స్వయంగా వ్రాసిపెట్టినట్టు ప్రజాసముదాయానికి తెలిస్తే విలువతగ్గి విశ్వసించరనే విశ్వాసంతో, మనకతీతంలో వున్న భగవంతుడు సృష్టించాడని ప్రబల తార్కాణాలతో, తరిగిపోశారు. సరే ఇక ఆభగవంతుడున్నాడో, లేడో, తరువాత విమర్శించుదాం.

ముందా వేదాల పరమార్థమేమిటో, పురాణాల యాదార్థ్యమెంతో, విమర్శించుదాం. నిజంగా వేదాలను మేము నమ్మమనిగాని, పురాణాలను మేము విశ్వసించమనిగాని, కచ్చితంగా జెప్పడం విరుద్ధవాదానికి మార్గదర్శిగావుంటుందని చెప్పడంలో అతిశయోక్తిలేదు. అయితే వ్రాసినవేదాన్ని అక్షరం విడచిపెట్టకుండా ఆలకించి ఆచరించవలసివుంటుందా? అంటే, అదిమూఢత్వానికిగాఢమైన తార్కాణంగావుంటుంది. అందువల్ల విజ్ఞానదృష్టితో, విమర్శనాదృష్టితో దేశకాలపరిస్థితుల పరిణామసరణితో, పరికించి పరీక్షించి, దోషాన్ని పరిత్యజించి శేషాన్ని స్వీకరించాలి.

ఎందువల్లనంటే అప్పటిదృష్టితో తీర్చి కూర్చిన వేదాలు, ఇప్పటిదృష్టికి వైకల్యంగావుంటాయి. కారణం అప్పటి మానవ జాతి పశుత్వంలో వుండడంవల్లనే. అందుకు తార్కాణ్ణా ఈ నవీననాగరికతను నాలుగడుగులు వెనక్కు నడిపించితే మానవత్వంమారి, పశుత్వంలోకిజేరిచివరకు క్రిమికీటకాదుల్లో జేరుతుంది. అందువల్ల పూర్వం పశుప్రాయంగా వుండేవారు మానవులు ఆమూఢత్వాన్ననుసరించి విమర్శనలేకుండా ఆమోదించారా వేదాల్ని. తెలియనివాళ్లుగాబట్టి దేవుడు వ్రాసిందన్నా ఒప్పుకోవాలి. దయ్యంవ్రాసిందన్నా ఒప్పుకోవాలి ఆస్థితిలో వారున్నప్పుడు ఆవేదాలు మహాప్రసాదాలుగా ఉండేవి. పామరజానానికి. ఇప్పటి విజ్ఞానశ్రోతల కలజడి, ఆందో ళనకలిగించి కలవరబెడతాయి. కాబట్టి, ఆకాలానికి ఆ ప్రజా సముదాయానికి ఆవేదాలన్వయించాయి గాని ఈకాలపరిస్థితులను పురస్కరించుకొని అడుగు తప్పకుండా వేదాన్నంగీకరిస్తానంటే మాత్రం మూఢత్వానికి ప్రధాన లక్షణమవుతుంది.

తరువాత పురాణాల్లోకి దించుదాం వ్యవహారాన్ని. భారతభాగవతాలను కేవలం త్రోసిపుచ్చడం సమంజసంగాదు గానికొంతసంస్కారం చేయించి విశ్వసించాలి.రామాయణంలో జెప్పిన రాముణ్ణి సాక్షాత్తు ఏదేవతనో, దయ్యానునో వీరపూజలు చేసి, చేసేఘోరకార్యాలు మానకుండా వుండేకంటే, వాడూ ఒక మహత్తరమైన విజ్ఞానసంపన్నుడు. తండ్రియాజ్ఞ పరిపాలించిన సహజసౌజన్యశీలుడు అనేభావంతో రాముణ్ణి అనుసరించితే కొంతవరకు వీలుగానేవ్వంటుంది. అసలు రామాయణం

వ్రాసిన వాల్మీకులవారి సహజోద్దేశాన్ని, రామాయణం యొక్క వుద్దేశాన్ని విమర్శించి చదివితే మన మింత మూఢభక్తులమై; చైతన్యరహితమైన రాళ్ళనుపూజించుతూ, వాటికోసం బీదలనోళ్ళుగొట్టి కోట్లరూపాయలు ఖర్చుపెట్టడం సంభవించేదేగాదు.

కవిగారిఉద్దేశాన్ని, కథలో విషయాన్ని గమనించి, రాముని ఉదారస్వభావాన్ని, అతని దాతృత్వమహిమా విశేషాన్ని, తెలుసుకొని, సత్యవాక్పరిపాలనాశీలురై అందరూ రాముళ్ళమాదిరిగా సిద్ధమై, దేశాన్నిఉద్ధరించుకోండి అని సామాన్యంగా కవిగారియుద్దేశమనుకుంటాను. సరే ఇక దానికి ప్రతిరూపంగా మనం చేసే కార్యకలాపాలేలావుంటాయో విచారించకుందాం. రామకథలోవున్న నడకనుమాత్రం గమనించి నడవడం మానేశారు మొదటిప్రశ్న.

తల్లిదండ్రులమాట వినకుండానే ఎదిరించి రాముణ్ణి పూజించేవా రనేకులున్నారు. అదిమాత్రం కథావిధానంలో వున్న రహస్యోద్దేశానికి అమితవైరాగ్యం. రాముడు ఏకపత్నీవ్రతుడని చెప్పుతూ ఎనమండ్రుగుర్ని వెంబడించి తిరిగే మహానుభావు లనేకులున్నారు. ఇన్నిటికంటె విచారించదగ్గ విషయం మరొక్కటుంది. రాముడూ మానవుడే గాబట్టి మన తాతముత్తాతలు మాదిరిగానే కాలధర్మం పొందాడు. సరే చచ్చిపోయినవాణ్ణి గురించి కాస్తవిచారించి ఆకథలోవున్న నీతిని నేర్చుకోనేదిపోయింది సరిగదా? రాముని బొమ్మలుచేసి, చిన్నపిల్లలు మంటిబొమ్మలుచేసినట్లు పూజలు పునస్కారాలు

నైవేద్యాలు, పైవైద్యాలు చేయడం ప్రారంభించారు. నీతిని విడచిపెట్టి. చచ్చిపోయినతరువాత గాల్లోగాలి లీనమైపోయిందనే అన్వయం సులువుగా దొరుకుతూవుంటే, పోయినవాడు మళ్లావస్తాడనిగాని, మోక్షమిస్తాడనిగాని, రక్షించుతూ, తప్పు చేస్తే శిక్షకూడా అతనే పురమాయిస్తాడని పిచ్చి వేదాంతం లోకిదిగి క్లిష్టాన్వయంలోకి పోవడం మర్ఘటమన్న సంగతి వీరి కెందుకుతోచదో, అందువల్ల పురాణాలు వ్రాసిన వుద్దే శాన్ని గమనించకుండా చదివి, ప్రధానమైన గుణాన్ని విడచి పెట్టి, చైతన్యరహితమైనవాణ్ణి, స్వరూపరహితమైనవాణ్ణి, అటు వంటి వాని పేరుచెప్పుకొని గుళ్ళల్లోకిచేరి వుపవాసాల పేరుచెప్పు కొని కఠినలంఘనాల కెందరో ఆహుతవుతున్నారు.

కాబట్టి, ఆ దృష్ట్యాపురాణపఠనం బూడిదలో పన్నీరు పోసిన చందమేగాని, వేరేప్రయోజనంలేదని సగర్వంగా జెప్ప వచ్చు. ప్రతివానికి మన కతీతమైన వ్యక్తొకడు అంతరిక్షాన సంచ రిస్తున్నాడనీ, పుణ్యపాపాలు నగరస్వరూపం దాల్చి, ఆకాశంలో ఒకటి, అధోలోకంలో ఒకటి, వున్నాయనిన్నీ పిచ్చినమ్మకాలు పట్టుకొని చాలామందిని బాధిస్తున్నాయి. కాని, అటువంటి రజ్జుసర్పభ్రాంతికి భీతిల్లడం మనోదౌర్బల్యమేగాని, మరేమీ లేదు.

మన కతీతమైన పదార్థమొకటుంది. అది మనకు స్వరూ పాన్నిచ్చేదే, సులువుగా తపస్సులు చేయకుండా సిద్ధించేదే, దానికే వీరపూజలు, ఘోరతపస్సులు, ఉపవాసాలు, మూఢ నమ్మకాలు, గాఢమైనవ్రతాలు ఇత్యాదికవర్గంతో సంబంధ

మేమీ లేదు. అయితే వుండవలసిందొక్కటుంది. అతిమహత్తరమైన విజ్ఞానం. అయితే ఆ విజ్ఞానం అతీతమా అంటే ? ప్రయత్నం లేనివానికిగాని, ప్రయత్నించు వాని కతీతమే గాదు. అసాధ్యమైనదైనా సులువుగా హస్తగతమై వూరకుంటుంది. జతనమొనరించు వారికే జతపడుసిరి, అని విజ్ఞానవంతులు చెప్పిన సూత్రాన్ని సులువుగా తొలగించడాని కవకాశముంటుందా? లేదు. ప్రయత్నించి ఫలసిద్ధిని పొందడంలో ఆస్తిక మతం వారికి నాస్తిక మతంవారికి ఒకటేక్రియ.

వారు చెపుతున్నారు? భగవంతుని ప్రయత్నించిన వాడే పొందగలుగుతాడుగాని, ప్రయత్నించనివాడు పొందలేడని కచ్చితంగా చెపుతున్నారు. ఇంతరకూ వారికి మనకూ దగ్గరబాంధవ్యమున్నట్టే తోస్తుంది. అయితే వారికీ మనకూ మనస్సులు భేదించిందెక్కడయ్యా అంటే? మనమనుకుంటున్న విజ్ఞానాన్నే భగవంతుడని పూజోపచారాలు చేస్తున్నారు వారు వీరనుకుంటున్న భగవంతుణ్ణి విజ్ఞానమనుకొని తీవ్రంగా చదివి పరీక్షులయందుత్తీర్ణుల మవుతున్నాం మనము.

అయితే సహజమైన సత్పదార్థమొకటుంది వారికి మనకూ, అయితే దాన్ని భావనచేసుకోవడంలో భేదంపుట్టి బాధలుపడుతున్నాం భావనలోనే భావిప్రపంచ సౌభాగ్యమంతా నిండివున్నది గాబట్టి పొందవలసిన సత్పదార్థాన్ని పొందడానికి ప్రయత్నిస్తూ భావనలో మార్పుచేకూర్చుకొని, భావి ప్రపంచ సౌభాగ్యసాధానికి ప్రధమ సోపాన మేర్పరుచు

కోవాలి. ఆభావనాపరివర్తనపైనే భారతాభ్యుదయం ఆధార పడివుంది.

మన భావనాఫలకంలోనే భావిజీవితముద్రలు ప్రతి ఫలిస్తున్నాయి కాబట్టి, స్వయంపోషకత్వంకంటే పరోపకారమే మిగుల శ్రేయస్కరమనిన్నీ, అందులో దేశసేవచేయడం మానవ లక్షణమనిన్నీ, దేశసేవే చివరకు దేశసేవయే దైవసేవయని వేదాంతులు పండితులు సెలవిస్తున్నారు.

కాబట్టి ఏకక్రియాద్వ్యర్థకరీబభూవ. అన్నట్టుగా ఒక పనిచేయడం ప్రారంభిస్తే రెండువిధాలు అన్వయించాలిగాబట్టి, దేశసేవ నిర్వర్తించాలంటేమాత్రం భగవంతుడనే వాడు వేరే వున్నాడనే దృష్టిపెట్టుకుంటేమాత్రం దేశసేవకు పాత్రుడుగాడు. ఎందువల్లనంటే భగవంతున్నాడనే భావంవున్నట్టయితే, పుణ్య పాపాలు స్వర్గనరకాలూ, జన్మకర్మలు, జీవహింసలు సర్వము సిద్ధమవుతాయి. దానితో వేదాంతం నాటుకుపోతుంది. వెంటనే వైరాగ్యం సిద్ధమవుతుంది. తరువాత సర్వసంగపరిత్యాగం సంభవించేస్థితి ఎలాగూవుంది.

ఈవిధంగా ఆస్తికులవిధానం ప్రబలిపోతుంది. సర్వ సంగపరిత్యాగంచేసిన వాళ్లకు సంసారమే లేదు. సంసారంలేని వాళ్ళకు స్వగ్రామంలేదు. స్వదేశంలేదు. అపుడు దేశానికి భిన్ను లవుతారు. వారే చివరకు వారికి తెలియకుండానే దేశద్రోహు లుగా మారుతున్నారు. దేశంలో పుట్టి దేశాన్ని సంరక్షించు కోడానికి మారుగా దేశద్రోహులవడంకంటే, అజ్ఞానముగానీ, అమాయకత్వంగానీ, మరొకటిలేదన్న సంగతి జగద్విదితమే.

ఇంకా ఆస్తికులను విమర్శించవలసిన ఘట్టంకొంతుంది. మనకంటే అతీతమైనవాడున్నాడని, ఎప్పుడైతే హృదయ ఫలకంలో ప్రతిఫలించిందో, అపుడే సర్వకార్యభారాన్ని వాడి యందేవుంచి చేయతగిన కార్యకలాపాల్లోగూడా, తా ససమర్థు డైనట్టూ తనవల్ల జరిగేపని కొంచెంగూడ లేనట్టు ప్రవర్తిస్తాడు. ఏదైనా ఒక మహత్తరమైన సాధనాన్ని సాధించి సాఫల్యాం పొందినట్లైతే, ఆభగవంతుని కరుణాకటాక్ష వీక్షణ ప్రసారమే నని సంతోసం పొందుతాడు. లేక విఫలమనోరథుడైతేమాత్రం తన్ను తానే దూషించుకుంటాడు ఆ భగవంతునికి సంబంధం లేనట్టు. నిజంగా మనిషి విశేషంతో కార్యసిద్ధిని పొందు తున్నాననిగాని, ప్రయత్న లోపంచేతనో, బుద్ధిలోపంచేతనో అపజయంపొందుతున్నానని తలచక రెండుచోట్ల తానే కర్తగా వుండి, ఆత్మను విశ్వసించని విశ్వాసఘాతకులుగా సిద్ధమువ డానికి కారణమేమో అగమ్యగోచరంగావుంది. అందువల్ల ఆత్మ ద్రోహులని సంశయంలేకుండా చెప్పవలసివుంటుంది.

ప్రత్యక్షతార్కాణాలతో ప్రబలంగా సమాధానంచెప్పే హృదయాన్ని విశ్వసించకుండా వుండడం, పరోక్షంగా అంత రిక్షాన సంచరిస్తున్నాడని ఆకాశపుష్పంమీద అపేక్షపెట్టు కున్నట్టుగా నటించడం వారికీ మనకూ, అమిత వైరుధ్యం. అందువల్ల దేవుడున్నాడనేవాళ్ల పరిస్థితులెలా విమర్శించామో చూడండి.

వేదాంత వైరాగ్యాలవల్ల సన్యాసిత్వం సమీపించడం తరువాత సర్వసంగ పరిత్యాగ మవలంబించడం దేవుడున్నా

దన్నందువల్ల మొదట ఆత్మద్రోహిగా మారి తరువాత దేశ ద్రోహిగా పరిణమించడం సంభవించింది. ఇక దేవుడు లేదూ దయ్యము లేదూ వున్నది మహత్తరమైన దివ్యజ్ఞానమేనని కృషి చేసేవారి పరిస్థితులెలావుంటాయో పరికించుదాం.

నిజంగా భగవంతుడనే వాడున్నాడనుకోవడం పూజించడం విపరీతమైన అజ్ఞానం తప్ప మరేదీగాదు. ఏది మనకగమ్యగోచరంగావుందో దాన్ని భగవంతునిగా భావిస్తున్నారు మనవారు. తెలివితక్కువవల్ల తెలుసుకోవలసినదాన్ని గమనించలేక దాన్నొక దేవతగానో, దయ్యంగానో ఆరోపిస్తున్నారని నా విశ్వాసము. అందుకు చిన్న తార్కాణంతో మీరనుకున్న దేవుణ్ణి కాస్త విమర్శించి తెలుసుకుందాం గమనించండి. వర్షాలు కురుస్తున్నాయంటే, (మేఘనాథుడు) ఇంద్రునియొక్క కరుణా ప్రపూతమైన హృదయం చల్లబడితే మనం మనదేశం చల్లగావుంటామనిన్నీ వర్షం కురిపించడానికి కర్త అతనే ననిన్నీ తను కన్ను తెరిస్తే ప్రపంచంపండి నిండి వుంటుందనిన్నీ, కన్ను మూస్తే ఎండిపోతుందనివాణ్ణి మ్రొక్కే మ్రొక్కులు మనకు మిగుల తార్కాణాలుగావున్నాయి. అది అజ్ఞానంలోవున్నప్పుడు అంధకారస్వరూపమే ఇంద్రుడుగానూ, చంద్రుడుగానూ, భ్రాంతిని గొల్పింది.

ఇక విజ్ఞానదృష్టితో పరికిస్తే, మేఘమంటే, ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః అని కాళిదాసుగారు తన కల్పిత కావ్యంలో నిర్వచించారు. అందువల్ల పొగ కాంతి నీరు వాయువు సమ్మేళనాస్వరూపమే మేఘుని మొదట వ్యక్తమయింది.

దాన్ని వైజ్ఞానిక ప్రతిభావిశేషంచేత ఇతరదేశస్థులు గాలివిమానాన్ని నిర్మించి, మేఘం దగ్గరకుపోయి, ఇసుక ప్రయోగంచేసి మంచుగడ్డవలె అర్ధస్వరూపంతోవున్న పదార్థాన్ని చిత్రవధ చేసేసరికి చైతన్యంకలిగి కరిగి స్రవించింది వర్షంగా. ఇంద్రుని స్వరూపంగూడా లేదక్కడ అనుకున్నవాడు లేడక్కడ. కార్యం సిద్ధించింది. సహజంగావున్న సత్పదార్థమే బయటబడిందక్కడ. అందువల్ల అజ్ఞానదశలో ప్రతిఫలించిన ఇంద్రచంద్రాదులు విజ్ఞానదృష్టికి భీతిల్లి అంతర్థానమయ్యారు గాబోలు. సహజ స్వరూపాలే నిలచివున్నాయా ప్రదేశంలో. అందువల్ల పొందవలసింది విజ్ఞానాన్నిగాని, భగవంతుణ్ణి గాదు. అందువల్ల భగవంతుడనేభ్రాన్తి ఎవరికైనా వుందంటే? ముందు అజ్ఞానం పూర్తిగా ప్రబలివుందని చెప్పడంలో సందేహంలేదు. కాబట్టి ఆస్తికులనుకుంటున్న భ[illegible] దివ్యజ్ఞానంక్రింద మార్చుకుంటే, వారికీ మనకూ స[illegible] కలుగుతుంది.

ఎప్పుడయితే దేవుడు[illegible] న్నామో, ఆరోజునే పుణ్యంలేదు పా[illegible] స్వర్గనర కాలు అంతర్థానమవుతా[illegible] దాలుస్తాయి. లేక ఇవన్నీ[illegible] ఇంతలో ఏ ఒక్కనూ[illegible] వాదాలకే ఎప్పుడ[illegible] పరీక్షించుదా[illegible]

వుంటుండనియు, ముందు కర్మతరువాత బుద్ధి అని నూరిపోశారు పామరజనానికి. నిజంగా దాన్ని విమర్శించేబుద్ధేవుంటే, ఆసూక్తిని వారప్పుడే వుపసంహరించుకొనేవాళ్ళు. అదిలేక వారంగు కంగీకరించి, ఈ పామరవర్గం క్షుద్బాధను భరించలేక మలమల మాడిపోతున్నారు, కోటానుకోట్లు కారణం కటాక్షించండి అని ప్రశ్నించిది. అందుకు పండితమండలికి శ్లోకాలు తక్కువగా వుంటేగా? మాటలుచెపితే బూటకాలుగా వుంటాయని గ్రహించి, పామరజనమంతా కవిత్వమంటే భగవంతుడు వ్రాశాడనే భ్రాంతిలోవున్నప్పుడు భక్తిపూర్వకంగా కొన్నిమాటలకు శ్లోక స్వరూపమిచ్చారు.

శ్లో॥ అదానదోషేణభవే ద్దరిద్రః, దారిద్ర్యదోషేణ
కరోతిపాపం పా [illegible] శ్యం నరకంప్రయాతి, పునర్దరిద్రః పున
రేవపాపీ,అని [illegible] గా చెప్పేవారు. దీని పరమార్థ
మేమిటంటే [illegible] దానంచేయని దోషంచేత దరి
ద్రు డవు [illegible] దోషంచేత పాపంచేస్తాడనిన్నీ
పాపం [illegible] డనిన్నీ తిరిగి దరిద్రుడుగాను
[illegible] ర్థం చెప్పేవారు. అయితే
[illegible] లు మహాప్రసాదంగానే
[illegible] కుసూత్రాలు తారు
[illegible] ముందు కర్మముం
[illegible] అగ్రస్థాన

తుంది. కర్మనే సరికల్ల నిర్వర్తించే కార్యకలాపాదులని స్ఫుటంగా స్ఫురించుతోంది. అటువంటి సందర్భంలో భావోదయం కలిగిన తరువాత కార్యరంగంలో ప్రవేశిస్తాడో, లేక కార్యరంగంలో ప్రవేశించి పని నిర్వర్తించుతూ, నేనాపనిని చేయాలే? అని నిర్ఘాంతపోతాడో, పక్షపాతభావంలేని భారతీయుల కర్థమవుతుంది. సందేహముంటే, చిన్నసామెతగూడ నిరూపించుదాం.

నేనుకాశీ వెళ్లాలని సంకల్పించుకొని మరునాడు సతీసమేతంగా, సామగ్రి తీసుకొని కాశీ మూడురోజులకు చేరాననుకోండి. సంకల్పమనే బుద్ధికలిగినతరువాత ప్రయాణించానో, ప్రయాణంచేస్తూగాని, కాశీవెళ్లిగాని, సంకల్పించుకొన్నానో కాస్త విచారించండి. ఏ విధంగాచూచినా ఆ సూత్రకారుడు ఈ నాటికి పాత్రుడుగాడనిమాత్రం హృదయంలో వుంచుకోవాలి. అందువల్ల విమర్శించితే, ఈ సూత్రం తారుమారైనట్లు, ప్రతి విషయాన్ని పరిశీలిస్తే, అజ్ఞానమనే ఆవృతిపోయి, లోపల సత్పదార్థం బయటపడుతుంది. అజ్ఞానంయొక్క వుద్దేశం నూతనమైన కృత్రిమ స్వరూపాన్నారోపించడం. విజ్ఞానంయొక్క వుద్దేశం సహజమైన సత్పదార్థాన్నే నిరూపించడం. ఈ విధంగా వుంటాయి ఈ రెంటివ్యాపారాలు. ఆ విధంగానే రెండోసూత్రం గూడా, దానంచేయని దోషంచేతనే ఈ విధంగా దరిద్రులు పాపాత్ములవుతున్నారని సెలవిచ్చారు.

దానిసంగతిగూడా కాస్త పరిశీలించుదాం. పాపంగాని పుణ్యంగాని, వున్నట్లయితే, ప్రపంచంలో మానవులు ఎక్కడెక్కడయితే వున్నారో అక్కడక్కడల్లా వుండవలసిందేగదా?

సరే అంతవరకూ బాగానే వుంటారు. సరే దానికిగూడా చిన్నసామ్యం చెప్పుకుందాం.

ఏ తర్కవితర్కాలకైనా తార్కాణంవుంటేనేగాని విశ్వసించడాని కనుకూలంగావుండదు. మనదేశంకంటె చాల చిన్నది రష్యాదేశం. అక్కడ జనసంఖ్య పద్దెనిమిదికోట్లవరకూ వున్నారు. వారిని జారుచక్రవర్తి పరిపాలించుతున్నాడు. అతని హృదయం పాషాణసదృశమని ప్రజలనుపెట్టే బాధలవల్లనే వ్యక్తమవుతుంది. తీవ్రతరమైన బాధాజ్వాలల కాహుతిచేస్తు న్నాడు ప్రజాసమూదాయాన్ని, మనదేశంలో ఏడుకోట్లమంది తిండిలేక బాధపడుతూవుంటే అక్కడ తొమ్మిదికోట్లమంది మితిలేని దరిద్రావస్థలోనున్నారు. అక్కడగూడా ఈవిధంగానే ఈ శాస్త్రాలే అన్వయించాయి కొన్నిరోజులు.

తరువాత ఆకటిచిచ్చును ఆర్పుకోలేక, పరపీడిత జీవి తాన్ని తృణప్రాయంగా తలపోసి, అలగ్జాండరనే మహాయోధుడు జారుప్రభువును స్వయంగా చంపడానికి ప్రయత్నించి విఫల మనోరథుడయ్యాడు. కారణంబుద్ధి పొరపాటనని సమాధానం చెప్పుకున్నాడుగాని, దైవసంకల్పమని పిచ్చివేదాంతంలోకి ప్రవే సించలా. తరువాత రాజద్రోహిక్రింద వురితీయబడ్డాడా మహా శయుడు. అందుకు మనమందరం ధన్యవాదా లర్పించుకోవలసిందే ఆధైర్యమూర్తికి. ఎందువల్లనంటే. విప్లవకణాన్ని వెలిగించి అంతరించిన మహాతీవ్రజ్యోతి అతడు.

తరువాత అతని సోదరుడు, ఎనిమిదివత్సరాల ప్రాయం గలబాలుడు, లెనిన్ అనే విప్లవజ్యోతి. అతడు సంవత్సరాలను

రోజులక్రింద జమగట్టుకొని అతిత్వరితంగా యువకుడై, అన్న గారిని హింసించిన ఘోరపాపిని జారుని ధ్వంసంచేసి దేశభారాన్ని తొలగించాలనే విప్లవజ్యోతులు ప్రళయాగ్నిమాదిరిగా ప్రజ్వలించాయి అతని హృదయ కుహరంలో. ఏ కార్యక్రమాన్ని నిర్వర్తించలేక అగ్రజుడు అగ్నికాహుతిగా సిద్ధమయ్యాడో, ఆ కార్యక్రమాన్ని ద్విగుణీకృతంగా నిర్వర్తించి దిగ్విజయాన్ని పొందాలనే భావోదయం కలిగింది. ఆ స్తికమతాన్నను సరించి పూనుకుంటే, దేశందాస్యాలపాలై యేటట్టు కన్పించింది. కర్మవల్ల సంప్రాప్తించిన దౌర్భాగ్యమేమోనని విరమించుకొంటే? దేశంలో అధర్మం అద్వితీయంగా రాజ్యమేలేటట్టు కనిపించింది. అందువల్ల లెనిన్ కాలాగ్నిజ్యోతిగామారి ఆ స్తికమతాన్ని ఆపాదమస్తకం భస్మీపటలంచేశాడు. జన్మకర్మల్ని రూపుమాపు తాననే ధైర్యసాహసాలను ద్విగుణీకృతంచేసి, దేశంలో కార్మిక సంఘాలు కర్షకసంఘాలు విరివిగా స్థాపించి మితిలేని సైనిక దళాన్ని సిద్ధంచేసి జారుప్రాణాన్ని ఆహారంగా పుచ్చుకొన్నాడు. తరువాత రాజ్యాంగపద్ధతులను మార్చి, నూతనవిధానాన్ని తీర్చి, సర్వసమానత్వాన్నికూర్చి, ప్రతివానికి, ఆనందాన్ని సౌఖ్యాన్ని ఎవరికనుకూలమయినట్టు వారికిస్తున్నాడు. దానికి స్టాలిన్ అనువానిని అధ్యక్షునిగా నియమించాడు.

ఇప్పుడు ప్రశాంతంగావుంది దేశం. ఇప్పుడు మీ కర్మ కాండలెటుపోయినాయండీ అని అడిగితే తప్పుకోడానికి దారి లేక తబ్బిబ్బులై, ఇప్పటికి తొలగిపోయింది కర్మనిచెప్తారు. ఈ సమాధానం మనకేంబోధిస్తుంది? ధైర్యసాహసాలను, బుద్ధి

పరాక్రమాలను ప్రయోగించితే కర్మతొలగి పోతుందని వ్యక్తమవుతోంది. కాబట్టి బుద్ధి ననుసరించే కర్మతొలగిపోవడంగాని, రావడంగాని సంభవించిందిగాబట్టి ఆ సూత్రాన్ని తారుమారు చేసింది ఇప్పటి విజ్ఞానదృష్టి.

అందువల్ల ఎప్పటికైనా, అజ్ఞానం అంతర్ధానమయిన తరువాతనైనా, వారు వారి సూత్రాలు మనకు లొంగిమన్ననుసరించవలసిందేగాని, మనం మాత్రం వారిలో చేరమని భారతయువకుల హృదయఫలకంలో ప్రతిఫలించేటట్టుచేసుకొని, భారత సౌభాగ్యాన్ని పునరుద్ధరించుకోవాలి.

భారతీ ప్రెస్, తెనాలి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B190 |
| పుస్తకం పేరు | వెలుగు రవలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C,F,IV,VIII |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |